ద్విచారస్య. తృతీయే పాదే మహాభూతసృష్ట్యాదిశ్రుతీనాం పరస్పరవిరోధః పూర్వభాగేన పరిహృతః. ఉత్తరభాగేన తు జీవవిషయాణామ్. చతుర్థపాదే ఇంద్రియాదివిషయశ్రుతీనాం విరోధపరిహారః. తృతీయాధ్యాయే సాధననిరూపణమ్. తత్ర ప్రథమపాదే జీవస్య-పరలోకగమననిరూపణేన వైరాగ్యం నిరూపితమ్. ద్వితీయపాదే పూర్వభాగేన త్వంపదార్థ శ్శోధితః. ఉత్తరభాగేన చ తత్పదార్థః. తృతీయపాదే నిర్గుణే బ్రహ్మణి నానాశాఖాపఠితః పునరుత్తరపదోపసంహారః కృతః. ప్రసంగాచ్చ సగుణవిద్యాసు శాఖాంతరీయగుణోపసంహారానుపసంహారౌ నిరూపితౌ.

చతుర్థపాదే నిర్గుణబ్రహ్మవిద్యాయాః బహిరంగసాధనాన్యాశ్రమధర్మ-యజ్ఞ-దానాదీని, అంతరంగసాధనాని శమ-దమ-నిదిధ్యాసనాదీని చ నిరూపితాని.

చతుర్థేఽధ్యాయే సగుణనిర్గుణవిద్యయోః ఫలవిశేషనిర్ణయః కృతః. తత్ర ప్రథమపాదే శ్రవణాద్యావృత్త్యా నిర్గుణం బ్రహ్మ, ఉపాసనావృత్త్యా సగుణం వా బ్రహ్మ సాక్షాత్కృత్య జీవతః పాపపుణ్యాలేపలక్షణా జీవన్ముక్తిరభిహితా

ద్వితీయపాదే మ్రియమాణస్యోత్క్రాంతిప్రకారశ్చింతితః. తృతీయపాదే సగుణబ్రహ్మవిదో మృతస్యోత్తరమార్గోఽభిహితః. చతుర్థపాదే పూర్వభాగేన నిర్గుణబ్రహ్మవిదో విదేహకైవల్యప్రాప్తిరుక్తా.

ఉత్తరభాగేన సగుణబ్రహ్మవిదో బ్రహ్మలోకే స్థితిరుక్తేతి ఇదమేవ సర్వశాస్త్రాణాం మూర్ధన్యం, శాస్త్రాంతరం సర్వమస్యైవ

శేషభూత మితీదమేవ ముముక్షుభిరాదరణీయం శ్రీశంకరభగవత్పాదోదితప్రకారేణేతి రహస్యమ్.

అథ ధర్మశాస్త్రాణి.

ఏవం ధర్మశాస్త్రాణి మను-యాజ్ఞవల్క్య-విష్ణు-యమాంగిరో-వసిష్ఠ-దక్ష-సంవర్త-శాతాతప-పరాశర - గౌతమ-శంఖలిఖిత - హారీతా-పస్తంబో-శనో-వ్యాస - కాత్యాయన-బృహస్పతి-దేవల-నారద-పైఠీనసిప్రభృతిభిః కృతాని వర్ణాశ్రమధర్మవిశేషాణాం విభాగేన ప్రతిపాదకాని.

ఏవం వ్యాసకృతమహాభారతం, వాల్మీకికృతం రామాయణం చ ధర్మశాస్త్ర ఏవాంతర్భూతం స్పష్టమితిహాసత్వేన ప్రసిద్ధమ్. సాంఖ్యాదీనాం ధర్మశాస్త్రాంతర్భావేఽపీహ స్వశబ్దేనైవ నిర్దేశాత్పృథగేవ సంగతిర్వాచ్యా.

చత్వార ఉపవేదాః.

అథ వేదచతుష్టయస్య క్రమేణ చత్వార ఉపవేదాః.తత్రాయుర్వేదస్యాష్టౌ స్థానాని భవంతి సూత్రం శారీరమైంద్రియం చికిత్సా నిదానం విమానం కల్పః సిద్ధిశ్చేతి.

బ్రహ్మ-ప్రజాప-త్యశ్వి-ధన్వంత - రీంద్ర-భరద్వా-జాత్రే - యాగ్నివేశ్యాదిభిరుపదిష్టశ్చరకేణ సంక్షిప్తః తత్రైవ సుశ్రుతేన పంచస్థానాత్మకం ప్రస్థానాంతరం కృతమ్.

కామశాస్త్రం.

ఏవం వాగ్భటాదిభిరపి బహుధేతి న శాస్త్రభేదః. కామశాస్త్రమప్యాయుర్వేదాంతర్గతమేవ. సుశ్రుతేన వాజీకరణాఖ్యకామశాస్త్రాభిధానాత్. తత్ర వాత్స్యాయనేన పంచాధ్యాయా

త్మకం కామశాస్త్రం ప్రణీతమ్. తస్య చ విషయవైరాగ్య మేవ ప్రయోజనం, శాస్త్రోద్దీపితమార్గేణాపి విషయభోగే దుఃఖమాత్రపర్యవసానాత్. చికిత్సాశాస్త్రస్య చ రోగతత్సాధన-రోగనివృత్తితత్సాధనజ్ఞానం ప్రయోజనమ్.

## ధనుర్వేదః.

ఏవం ధనుర్వేదః పాదచతుష్టయాత్మకో విశ్వామిత్ర ప్రణీతః. తత్ర ప్రథమో దీక్షాపాదః; ద్వితీయస్సంగ్రహపాదః; తృతీయస్సిద్ధిపాదః; చతుర్థః ప్రయోగపాదః. తత్ర ప్రథమపాదే ధనుర్లక్షణమధికారినిరూపణం చ కృతమ్ తత్ర ధనుశ్శబ్దశ్చాపే రూఢోఽపి చతుర్విధాయుధవాచీ వర్తతే. తచ్చ చతుర్విధం.— ముక్తం, అముక్తం, ముక్తాముక్తం, యన్త్రముక్తం చేతి. తత్ర ముక్తం చక్రాది, అముక్తం ఖడ్గాది, ముక్తాముక్తం శల్యావాంతరభేదాది, యన్త్రముక్తం శరాది. తత్ర ముక్తమస్త్రమిత్యుచ్యతే. అముక్తం శస్త్రమిత్యుచ్యతే. తదపి బ్రాహ్మ-వైష్ణవ-పాశుపత-ప్రాజాప-త్యాగ్నేయాదిభేదాదనేకవిధమ్. ఏవం సాధిదైవతేషు సమన్త్రకేషు చతుర్విధాయుధేషు యేషామధికారః క్షత్రియకుమారాణాం తదనుయాయినాం చ తే సర్వే చతుర్విధాః పదాతి-రథ-గజ-తురగారూఢాః దీక్షాభిషేకశకునమంగళకరణాదికం చ సర్వమపి ప్రథమపాదే నిరూపితమ్. సర్వేషాం శస్త్రవిశేషాణామాచార్యస్య చ లక్షణపూర్వకం సంగ్రహణ ప్రకారో దర్శితః ద్వితీయపాదే. గురుసంప్రదాయసిద్ధానాం శస్త్రవిశేషాణాం పునఃపునరభ్యాసో మన్త్రదేవతాసిద్ధికరణమపి నిరూపితం తృతీయపాదే.

ఏవం దేవతార్చనాభ్యాసాదిభిః సిద్ధానామస్త్రవిశేషాణాం ప్రయోగశ్చతుర్థపాదే నిరూపితః. క్షత్రియాణాం స్వధర్మాచరణం యుద్ధం దుష్టదస్యుచోరాదిభ్యః ప్రజాపాలనం చ ధనుర్వేదస్య ప్రయోజనమ్. ఏవం చ బ్రహ్మ-ప్రాజాపత్యాదిక్రమేణ విశ్వామిత్రప్రణీతం ధనుర్వేదశాస్త్రమ్.

ఏవం గాంధర్వవేదశాస్త్రం భరతేన ప్రణీతమ్. తత్ర నృత్య-గీత-వాద్య-నాట్యభేదేన బహువిధోఽర్థః ప్రపంచితః. దేవతారాధన నిర్వికల్పసమాధ్యాదిసిద్ధిశ్చ గాంధర్వవేదస్య ప్రయోజనమ్.

ఏవమర్థశాస్త్రం చ బహువిధం నీతిశాస్త్రం, అశ్వశాస్త్రం, గజశాస్త్రం, శిల్పశాస్త్రం, సూపకారశాస్త్రం, చతుష్షష్టికలాశాస్త్రం చేతి నానామునిభిః ప్రణీతమ్. తస్య చ సర్వస్య లౌకికాలౌకికతత్తత్ప్రయోజనభేదో ద్రష్టవ్యః. ఏవమష్టాదశవిద్యాస్త్రయీశబ్దేనోక్తాః.

## చతుష్షష్టికలాః.

తాశ్చతుష్షష్టికలాః శైవాగమోక్తాః.—గీతం ౧, వాద్యం ౨, నృత్యం ౩, నాట్యం ౪, ఆలేఖ్యం ౫, విశేషకచ్ఛేద్యం ౬, తండుల-కుసుమ-బలివికారాః ౭, పుష్పాస్తరణం ౮, దశన-వసనాంగరాగాః ౯, మణిభూమికాకర్మ ౧౦, శయనరచనం ౧౧, ఉదకవాద్యం ౧౨, ఉదక(ఘాతః) వాదః ౧౩, అద్భుతదర్శనవేదితా ౧౪, మాలాగ్రథనకల్పః ౧౫, శేఖరాపీడయోజనం ౧౬, నేపథ్యయోగాః ౧౭, కర్ణపత్రభంగాః ౧౮, గంధయుక్తిః ౧౯, భూషణయోజనం ౨౦, ఇంద్రజాలం ౨౧, కౌచుమారయోగాః ౨౨, హస్తలాఘవం ౨౩, చిత్రశాకాపూపభక్తవికారక్రియాః ౨౪,

పానక-రస-రాగాసవయోజనం ౨౫, సూచీవాపకర్మ ౨౬, సూత్రక్రీడా ౨౭, వీణాడమరుకవాద్యమ్ ౨౮, ప్రహేలికాప్రతిమాలాః ౨౯, దుర్వాచకయోగాః ౩౦, పుస్తకవాచనం ౩౧, నాటికాఖ్యాయికాదర్శనం ౩౨, కావ్యసమస్యాపూరణం ౩౩, పట్టికా-వేత్ర-బాణవికల్పాః ౩౪, తర్కుకర్మాణి ౩౫, తక్షణం ౩౬, వాస్తువిద్యా ౩౭, రూప్య-రత్నపరీక్షా ౩౮, ధాతువాదః ౩౯, మణిరాగజ్ఞానం ౪౦, ఆకారజ్ఞానం ౪౧, వృక్షాయుర్వేదయోగాః ౪౨, మేష-కుక్కుట-లావకయుద్ధవిధిః ౪౩, శుక-శారికాప్రలాపనం ౪౪, ఉత్సాదనం ౪౫, కేశమార్జనకౌశలం ౪౬, అక్షరముష్టికాకథనం ౪౭, మ్లేచ్ఛితకవికల్పాః ౪౮, దేశభాషాజ్ఞానం ౪౯, పుష్పశకటికానిమిత్తజ్ఞానం ౫౦, యంత్రమాతృకా ౫౧, ధరణమాతృకా ౫౨, అసంవాచ్యసంపాట్యం-మానసీకావ్యక్రియావికల్పాః ౫౩, ఛలితకయోగాః ౫౪, అభిధానకోశ - ఛందోజ్ఞానం ౫౫, క్రియావికల్పాః ౫౬, లలితవికల్పాః ౫౭, వస్త్రగోపనాని ౫౮, ద్యూతవిశేషః ౫౯, ఆకర్షక్రీడా ౬౦, బాలక్రీడనకాని ౬౧, వైనాయకీవిద్యాజ్ఞానం ౬౨, వైజయికవిద్యాజ్ఞానం ౬౩, వైతాలికీవిద్యాజ్ఞానం ౬౪, ఇతి చతుష్షష్టికలాః.

## అథ సాంఖ్యం యోగప్రస్థానం చ.

తథా సాంఖ్యశాస్త్రం కపిలేన భగవతా ప్రణీతమ్. తత్ర త్రివిధదుఃఖాత్యంతనివృత్తి - రత్యంతపురుషార్థ ఇత్యాదిషడధ్యాయాః. తత్ర ప్రథమేఽధ్యాయే విషయా నిరూపితాః, ద్వితీయేఽధ్యాయే ప్రధానకార్యాణి,తృతీయేఽధ్యాయే విషయవైరాగ్యం, చతుర్థేఽధ్యాయే విరక్తానాం పింగలాకురరాదీనా

మాఖ్యాయికాః, పంచమేఽధ్యాయే పరపక్షనిర్జయః, షష్ఠే పరార్థసంక్షేపః. ప్రకృతిపురుషవివేకజ్ఞానం సాంఖ్యశాస్త్రస్య ప్రయోజనమ్.

అథ యోగః.

తథా యోగశాస్త్రం భగవతా పతంజలినా ప్రణీతం "అథ యోగానుశాసనం" ఇత్యాది పాదచతుష్టయాత్మకమ్. తత్ర ప్రథమే పాదే చిత్తవృత్తినిరోధాత్మకం సమాధిర్వైరాగ్యరూపం చ తత్సాధనం నిరూపితమ్. ద్వితీయే పాదే విక్షిప్తచిత్తస్యాపి సమాధిసిద్ధ్యర్థం యమ - నియమాసన - ప్రాణాయామ - ప్రత్యాహార - ధ్యాన-ధారణ-సమాధయోఽష్టావంగాని నిరూపితాని. తృతీయపాదే యోగవిభూతయః. చతుర్థపాదే కైవల్యమితి. తస్య చ విజాతీయప్రత్యయనిరోధద్వారేణైవ నిదిధ్యాసనసిద్ధిః ప్రయోజనమ్. ఇతి యోగప్రస్థానమ్.

అథ పశుపతిమతమ్.

తథా పశుపతిమతం పాశుపతం శాస్త్రం భగవతా పశుపతినా పశుపాశవిమోక్షణాయ "అథాతః పాశుపతయోగవిధిం వ్యాఖ్యాస్యామః." ఇత్యాది పంచాధ్యాయం విరచితమ్. తత్రాధ్యాయపంచకేనాపి కార్యరూపో జీవః పశుః, కారణం పశుపతిరీశ్వరః, యోగః పశుపతౌ చిత్తసమాధానం, విధిర్భస్మనా త్రిషవణస్నానాదిర్నిరూపితః. దుఃఖాంతసంజ్ఞకో మోక్షశ్చాస్య ప్రయోజనమ్. ఏతే ఏవ కార్యకారణయోగవిధిదుఃఖాంతా ఇత్యాఖ్యాయంతే. ఏవం శైవం మంత్రశాస్త్రమపి పాశుపతశాస్త్రాంతర్గతమేవ ద్రష్టవ్యమ్.

## వైష్ణవమ్.

ఏవం చ వైష్ణవం నారదాదిభిః కృతం పాంచరాత్రమ్. తత్ర వాసుదేవ-సంకర్షణ-ప్రద్యు-మ్నానిరుద్ధాశ్చత్వారః పదార్థా నిరూపితాః. భగవాన్వాసుదేవః పరమేశ్వరస్సర్వకారణం తస్మాదుత్పద్యతే సంకర్షణాఖ్యో జీవస్తస్మాన్మనః ప్రద్యుమ్నస్తస్మాదనిరుద్ధోఽహంకారః. సర్వే చైతే భగవతో వాసుదేవస్యైవాంశభూతాస్తదభిన్నా ఏవేతి తస్య వాసుదేవస్య మనోవాక్కాయవృత్తిభిరారాధనం కృత్వా కృతకృత్యో భవతీత్యాది చ నిరూపితమ్.

ఏవం వైష్ణవం మంత్రశాస్త్రం పరిమితమపి పంచరాత్రమధ్యేఽంతర్భూతమ్. వామాగమాదిశాస్త్రం తు వేదబాహ్యమేవ. తదేవం దర్శితః ప్రస్థానభేదః.

## సర్వేషాం ప్రస్థానభేదః త్రివిధః.

సర్వేషాం సంక్షేపేణ త్రివిధ ఏవ ప్రస్థానభేదః. తత్ర ఆరంభవాద ఏకః, పరిణామవాదో ద్వితీయః, వివర్తవాదస్తృతీయః, పార్థివాప్యతైజసవాయవీయాశ్చతుర్విధాః పరమాణవో ద్వ్యణుకాదిక్రమేణ బ్రహ్మాండపర్యంతం జగదారభంతే. అసదేవ కార్యం కారణవ్యాపారాదుత్పద్యత ఇతి ప్రథమస్తార్కికాణాం మీమాంసకానాం చ ఇత్యారంభవాదః. సత్వరజస్తమోగుణాత్మకప్రధానమేవ మహదహంకారాదిక్రమేణ జగదాకారేణ పరిణమతే, పూర్వమపి సూక్ష్మరూపేణ సదేవ కార్యం కారణవ్యాపారేణాఽభివ్యజ్యత ఇతి ద్వితీయః పక్షః.

సాంఖ్య-యోగ-పాశుపతానాం, బ్రహ్మణః పరిణామో జగదితి వైష్ణవానామపి స్వప్రకాశపరమానందాద్వితీయం బ్రహ్మ

స్వమాయావశాన్మిథ్యైవ జగదాకారేణ కల్ప్యత ఇతి తృతీయః పక్షో బ్రహ్మవాదినామ్.

సర్వేషాం చ ప్రస్థానకర్తౄణాం మునీనాం వివర్తవాద పర్యవసానేనాద్వితీయే పరమేశ్వరే ఏవ వేదాంతప్రతిపాద్యే తాత్పర్యమ్. నహి తే మునయో భ్రాంతాః సర్వజ్ఞత్వాత్తేషాం, కింతు బహిర్విషయప్రవణానామాపాతతః పరమపురుషార్థే ప్రవేశో న భవతీతి నాస్తిక్యనివారణాయ తైః ప్రకారభేదాః ప్రదర్శితాః. తత్ర తేషాం తాత్పర్యమబుద్ధ్వా వేదవిరుద్ధేఽప్యర్థే తేషాం తాత్పర్యముత్ప్రేక్షమాణాస్తత్తన్మతమేవోపాదేయత్వేన గృహ్ణంతో జనాః ఋజుకుటిలనానాపథజుషో భవంతీతి న సర్వేషామృజుమార్గే ఏవ ప్రవేశో, న చ విపర్యయేఽపి పరమేశ్వరాప్రాప్తిరంతఃకరణశుద్ధివశేన పశ్చాదృజుమార్గాశ్రయణాదేవేత్యర్థః.

తా. ఓ శంకరా! నీచే రచింపఁబడిన ప్రపంచమందు మనుష్యులు చైతన్యమధికముగాఁగలవారు. వారు తమతమ పూర్వజన్మకర్మవాసనవలన ఈనరజన్మకలిగి జ్ఞానవంతులై సంసారసాగరమునుండి తరింపవలెననెడి సంకల్పము కలవారైనపుడు—సృష్టి సత్వాదిగుణత్రయముతో వ్యాప్తమై వాటిమేళనగా నానావిధ భేదము కలిగియుండుటచే వీరిబుద్ధులుకూడ నానావిధభేదమును పొంది విచిత్రములుగా నున్నందున ఈసంసారసముద్రమునుండి తరించి (దాఁటి) శాశ్వతసుఖమును బొందుకోరిక కలిగినపుడు— నీచేత సృజింపఁబడిన అనేకదేవతలు అనేకమంత్రములు అనేకశాస్త్రములు అనేకమతములు ప్రపంచమందు కలిగియున్నందున అవి సమష్టిని త్రయీ(వేద)సమ్మత మతములని, సాంఖ్యమతమని,

యోగమతమని, పాశుపతమతమని, వైష్ణవమతమని వీటిలోఁ గూడ అనేకభేదములు కలిగి ప్రస్థానములు (మతములు) తమ తమ బుద్ధులు నానావిధములుగా నున్నందున, వారివారిబుద్ధికి ఇష్టమైనమతమందుఁ బ్రవేశించుచు (అవలంబించుచున్నారు.) ఆ మతములున్నై తము ఋజుమార్గములు, వక్రమార్గములు కలిగియు న్నందున శీఘ్రముగాను వ్యవధానముగాను సిద్ధిని ఫలము నిచ్చు నవైయున్నందున, ఆయామతముల నవలంబించినవారి కందరికిని —నాకు ఈమతమిష్టము నాకు ఆమతమిష్టము అనెడిమనుష్యుల కందరికిని—జగత్తునందుఁగల సకలనదులకును ఋజుకుటిలభేద మువలనను శీఘ్రవ్యవధానభేదమువలనను సముద్రుఁ డెట్లు ప్రాప్యస్థానముగా నున్నాఁడో అదేరీతిని ఆయామతములవారం దరికిని నీవే గమ్యస్థానము—అనఁగా పొందవలసిన స్థానమగు చున్నాఁడవు. ఈజగత్తు నీవలననే పుట్టినందున నీయందే లయ మగుచున్నదని భావము. గంగా గోదావరి మొదలగు గొప్ప నదులు ఋజుమార్గము కలిగినందున శీఘ్రముగా సముద్రమును పొందుచున్నవి. యమునా సరయు మొదలగు కొన్నినదులు వక్ర మార్గముల కలవైనందున గంగానదిలోఁ గలసి వ్యవధానముగా సముద్రమందుఁ గలియుచున్నవి. ఈరీతిగనే వేదచోదితమైన నిర్గుణబ్రహ్మోపాసన చేసినవారు శీఘ్రముగా ఆత్మసాక్షాత్కార మును బొందుచున్నారు. నిన్ను దెలిసికొనఁజాలనివారు నీ మాయచే మోహితులయి వేదవిరుద్ధమతములందుఁ బ్రవేశించి నను ఆయాదేవలోకములను బొంది వారితోఁగూడ క్రమముగా నీసాయుజ్యమును పొందుచున్నారు. సకలజగత్తును నీవలననే పుట్టుచున్నది. మరల నీయందే లయమగుచున్నది. నీమహిమ

అపారమైనందున నీభక్తులకే తెలియును. అన్యులు తెలిసికొనం జాలరనియు నీవు దయాసముద్రుఁడవు కనుక అందరికిని నీవే గతియనియు స్తుతించిరి.

అవ. వెనుక చూపించిన పూర్వపక్షసిద్ధాంతములచేత పరమేశ్వరుని వర్ణించి భక్తానుగ్రహార్థము లీలాగృహీతమైన నవీన రూపమును వర్ణించుచు ఈశ్వరుని స్తుతించుచున్నారు:—

**మూ.** మహోక్షః ఖట్వాంగం పరశురజినం భస్మ ఫణినః
కపాలం చేతీయత్తవ వరద తంత్రోపకరణం,
సురాస్తాం తామృద్ధిం దధతి తు భవద్భ్రూప్రణిహితాం
న హి స్వాత్మారామం విషయమృగతృష్ణా భ్రమయతి.

వ్యా. ఏవం సర్వశంకోద్ధారపూర్వకం పరమేశ్వరం నిరూప్య అర్వాచీనపదస్థం లీలాగృహీతసగుణనవీనస్వరూపం వర్ణయన్ స్తౌతి:—మహోక్ష ఇతి హేవరద, తవ పరిపూర్ణ పరమేశ్వరస్యాప్యేతత్తంత్రోపకరణం తంత్రస్య కుటుంబధారణస్యోపకరణం సాధనమ్. తదేవాహ.—మహోక్షః మహానుక్షా వృద్ధవృషభః, ఖట్వాంగం ఖట్వాయా అవయవః శస్త్రవిశేషః కాపాలికానాం ప్రసిద్ధః, పరశుః టంకః కుఠారో వా, అజినం చర్మ, భస్మ పాంశుః, ఫణినః సర్పాః, కపాలం మనుష్యశిరోస్థి చేతి సప్తకమ్. నన్వేవం దరిద్రస్తుష్టోఽపి కిం దాస్యతీత్యత ఆహ.—సురా ఇత్యాది. సురాస్తు భవత్సేవయా భవద్భ్రూప్రణిహితాం భవతో భ్రూవిక్షేపమాత్రేణ సమర్పితాం తాంతామసాధారణీమృద్ధిం సంపత్తిం దధతి ధారయంతి. త్వమతిదరిద్రస్త్వద్భక్తాస్తు సర్వే సురాస్త్వత్ప్రసాదాత్సమృద్ధా ఇతి వ్యతిరేకం తు శబ్ద

ఆహ. యో హ్యన్యాన్ ధనవతః కరోతి స తదపేక్షయాధిక ధనవాన్భవతీతి ప్రసిద్ధం లోకే. నను తర్హీదృశోఽపి స్వయం కథం మహోక్షాదిమాత్రపరివార ఇత్యత ఆహ.—న హీత్యాది. హి యస్మాత్స్వ ఆత్మని స్వరూపే చిదానందఘనే ఆరమత్వా క్రీడత ఇతి తథా తం న భ్రమయతి న మోహయతి. విషయ మృగతృష్ణా విషయా ఇంద్రియార్థాః శబ్ద-స్పర్శ-రూప-రస - గంధాః త ఏవ మృగతృష్ణా జలబుద్ధ్యా గృహ్యమాణా మరీ చికా, యథా మృగతృష్ణా రవిరశ్మిరూపా జలవిరుద్ధస్వభావాపి భ్రాన్త్యా జలమయీవాభాసతే తథా విషయా అపి దుఃఖ రూపా భ్రాన్త్యా సుఖరూపా ఆభాసంత ఇతి రూపకార్థః.

యత్ర జీవోఽపి స్వాత్మారామతాం ప్రాప్తో న విషయా సక్తో భవతి, తత్ర కిము వక్తవ్యం నిత్యముక్తః పరమేశ్వరో విషయైర్నాభిభూయత ఇత్యభిప్రాయః తేన వృషభారూఢా ఖట్వాంగ - పరశు - ఫణి - కపాలాలంకృతచతుర్భుజా చర్మవసనా భస్మాంగరాగా వివిధభూషణా మాహేశ్వరీ మూర్తిః గురూప దేశేన జ్ఞాత్వా స్తుత్యాదిభిరారాధ్యేత్యర్థః. వస్తుతస్తు పురుష ప్రధానమహదహంకారతన్మాత్రేంద్రియభూతాని మహోక్షాది రూపేణ గుప్తాని భగవంతం మహేశ్వరముపాసత ఇత్యాగమ ప్రసిద్ధమ్. తస్య జగత్కుటుంబస్య తత్త్వాన్యేవోపకరణమితి నిష్కర్షః.

తా. ఓపరమేశ్వరా! నిర్గుణ - సగుణస్వరూపములుగల నీ మహిమ అపారమైనది. నీమాయచే మోహమును బొందినవారు అజ్ఞానముచే నిన్ను నీమాయను దెలుసుకొనఁజాలరు. నీసగుణ స్వరూపమందు నీకుఁ గలపరికరము ముసలిది గొప్పదియగు వృష

భము వాహనము. ఖట్వాంగము, పరశు, గండ్రగొడ్డలి, నీకు ఆయుధములు. వ్యాఘ్రచర్మము వస్త్రము. భస్మము అంగ రాగము. సర్పములు నానాలంకారములు. మానుషకపాలము నీకు పాత్ర. ఇవి నీపరికరము. నీకు సకలజగత్తు కుటుంబము. నీ సామగ్రిని ఆలోచించఁగా అతిదరిద్ర వేషముగా నున్నది. నీభక్తులైన సకలదేవతలు నీవలన పొందఁబడిన సకలైశ్వర్యములు కలవారు. లోకములో ఒకఁడు మరియొకనిని ధనవంతునిగాఁ జేయవలసినప్పుడు యాచకునికంటె దాత ధనవంతుఁడై యుండవలెను. అట్టి స్థితిలో ఇంతగొప్పకుటుంబముగల నీపరికరము చూడఁగా దరిద్ర వేషముగా నుండుటవలన నీమహిమ యెవరికిని దెలుసుకొనశక్యము కానిది. ఇట్లు విపరీతముగా నుండుటకుఁ గారణ మేమనిన: పరమేశ్వరుఁడు సదా అంతర్ముఖుఁడు స్వాత్మారాముఁడు గనుక. లోకమందు యోగులై ఆత్మయందే క్రీడగలవారికింద్రియవిషయములైన శబ్దస్పర్శాదులందు కోరిక ఉండదు. వారిని ఎండమావులవంటి విషయములయందాశ బాధించనేరదు. అందువలన నీవు మహాయోగివి, నీకు విషయములయం దిచ్ఛయే లేనందున, ఈవేషము చాలునని సంతుష్టి కలవాఁడవు. నీవు భక్తులగు దేవతలకు నీకనుబొమలసంజ్ఞ మాత్రముచేతనే సకలైశ్వర్యము నిచ్చుచున్నావని స్తుతించిరి.

ఇందలి రహస్యార్థము.

స్వర్గ-మర్త్య-పాతాళములనెడు మూఁడు లోకములకును సృష్టి-స్థితి-లయములకుఁ బరమేశ్వరుఁడే కర్త. అట్టి సర్వేశ్వరుని పురుషునకుఁ బ్రధానములైన మహదహంకారాదితత్వములును,

సకలేంద్రియములును వృషభాదిస్వరూపములతో సర్వదా సేవించుచున్నవని ఆగమరహస్యము.

లోకమందుఁ గల ఈశ్వరభక్తులు గురుముఖముగా వీరి నిర్గుణస్వరూపమునున్ను, భక్తానుగ్రహార్థము ధరించిన నవీనమైన వృషభవాహనము, ఖట్వాంగాద్యాయుధములు, సర్పాలంకారములు, పార్వతీదేవియు, పంచముఖములు, త్రినేత్రములు, చతుర్భుజములుఁ కలరూపమును, వీటిసంకేతములను దెలుసుకొని, వీరిని బూజించి త్రికరణములచేతను వీరినాశ్రయించినవారి కిహమందు సకలైశ్వర్యముల నిచ్చి ఆత్మసాక్షాత్కారమును గూడ ననుగ్రహింతురని భావము. ఇట్టి పరమేశ్వరుఁడు భాగ్యహీనునికే దరిద్రునిలాగు తోఁచును. వారిని దెలుసుకొనలేరు. జగత్కుటుంబియయిన పరమేశ్వరునికి తత్త్వములే గృహోపకరణములని నిష్కర్ష.

అవ. ఇంతవఱకు స్తుతింపఁదగిన పరమేశ్వరుని నిర్గుణసగుణ స్వరూపములను స్తుతించి, ఇప్పుడు స్తుతిప్రకారమును నిరూపించుచు స్తుతించుచున్నారు:—

మూ. ధ్రువం కశ్చిత్సర్వం సకలమపరస్త్వధ్రువమిదం
పరో ధ్రౌవ్యాధ్రౌవ్యే జగతి గదతి వ్యస్తవిషయే,
సమస్తేఽప్యేతస్మిన్పురమథన తైర్విస్మిత ఇవ
స్తువన్ జిహ్రేమి త్వాం న ఖలు నను ధృష్టా ముఖరతా.

వ్యా. ఏవం సంస్తూయమానం *పరమేశ్వరస్య నిర్గుణం సగుణం చ స్వరూపం నిరూప్య, సంప్రతి స్తుతిప్రకారం నిరూపయన్ స్తౌతి:—ధ్రువమితి. హే పురమథన, తైః స్తుతిప్రకారైః

త్వాం స్తువన్ న జిహ్రేమి నాహం లజ్జే. విస్మిత ఇవ జాతచమత్కార ఇవ యథా కశ్చిదద్భుతం దృష్ట్వా విస్మితస్తత్పరవశత్వాల్లోకోపహాసమగణయిత్వా విచేష్టతే తథాహమపి స్తోతుమయం న జానాతీతి జనో మాముపహసిష్యతీతి లజ్జామగణయన్ త్వత్స్తుతౌ ప్రవృత్తోఽస్మీత్యర్థః. తైః తైః ప్రకారైరిత్యాహ.—ధ్రువమిత్యాది. కశ్చిత్కోఽపి సాంఖ్యపాతంజలమతానుసారీ సర్వం సమగ్రం జగద్ధ్రువం జన్మనిధనరహితం సదేవ గదతి. వ్యక్తం వదతీత్యర్థః. న హ్యసత ఉత్పత్తిస్సంభవతి న వా సతో వినాశ ఇత్యావిర్భావతిరోభావమాత్రముత్పత్తివినాశశబ్దాభ్యామభిలక్ష్యతే. తేన పరమేశ్వరోఽపి తావన్మాత్రస్యేష్టే న త్వసత ఉత్పత్తేః, సతో వా వినాశస్యేత్యభిప్రాయః. ఇతి సత్కార్యవాద ఏకః పక్షః. తథాఽపరో అన్యః సుగతమతానువర్తీ సకలమిదమధ్రువం క్షణికమితి గదతి. నహి సతః స్థిరత్వం సంభవతి. అర్థక్రియాకారిత్వమేవ సత్త్వమ్. తచ్చ సదర్థస్య క్షణయోగేన న విలంబేనోత్పద్యతే ఇతి. ఏకస్మిన్ క్షణే సర్వార్థక్రియాసమాప్తేరుత్తరక్షణేఽసత్త్వమేవ. తథా చ పరమేశ్వరస్యాపి క్షణికవిజ్ఞానసంతానరూపత్వాదసావసత ఉత్పత్తేరిష్టే నతు సతః స్థిరత్వాయేతి ద్వితీయః పక్షః. సర్వక్షణికతావాదలక్షణః.

తదుభయపక్షాసహిష్ణుశ్చ పరస్తార్కికః సమస్తేఽప్యేతస్మిన్ జగతి ధ్రౌవ్యాధ్రౌవ్యే నిత్యత్వానిత్యత్వే వ్యస్తవిషయే భిన్నధర్మవర్తినీ గదతి ఆకాశాదిచతుష్కం పృథివ్యాదిచతుష్కపరమాణవశ్చ నిత్యాః. ఆకాశకాలదిగాత్మమనః పృథివ్యాదిపరమాణవశ్చ నిత్యాః ఇతి వా. కార్యద్రవ్యాణి చానిత్యాని. తథా చానిత్యానాముత్పత్తివినాశయోరిష్టే పరమేశ్వరో న తు

నిత్యానామపీత్యర్థః. ఇత్యేవం తృతీయః పక్షః. తథా చ త్రిష్వప్యేతేషు ద్వైతాంగీకారాదద్వితీయసన్మాత్రరూపస్య పరమేశ్వరస్య స్పర్శోఽపి నాస్తీతి సోపాధికసంకుచితైశ్వర్యరూపేణ స్తుతిః సర్వథా లజ్జాకరీత్యర్థః. తర్హి కిమితి న లజ్జస ఇత్యత ఆహ.—నను అహో ఖలు నిశ్చితం ముఖరతా వాచాలతా ధృష్టా నిర్లజ్జా. తథా చ ముఖరతైవ లజ్జామపహరతీత్యర్థః. ఏవం సర్వప్రకారప్రవాదకవాదాదీనామాభాసత్వముక్తమ్.

అద్వితీయవాదస్యైవ లజ్జాఽనాస్పదత్వేన సత్యత్వమితి ద్రష్టవ్యమ్. ఏతచ్చ "త్వమర్క స్త్వం సోమ" ఇత్యత్ర స్పష్టీకరిష్యతేతి.

తా. వెనుక చూపించిన పరమేశ్వరునిస్తోత్రములు కుతర్కము లెట్టివనిన చెప్పుచున్నారు. వ్యష్టి-సమష్టిరూపముగా నున్న ఈ జగద్విషయమై ఒకానొక సాంఖ్య పతంజలమతానుసారి సకల జగత్తు నుత్పత్తినాశములు లేనిదనియు, సకలము సద్రూపమనియుఁ జెప్పుచున్నాఁడు. అనఁగా పరమేశ్వరునికంటె భిన్నమని చెప్పుచున్నాఁడని భావము. అసత్తువలన ఉత్పత్తి సంభవించదనియు, సద్వస్తువుకు నాశము లేదనియు, ఈఉత్పత్తివినాశశబ్దములవలన ఆవిర్భావతిరోభావములు మాత్రము తెలియుచున్నది. అందువలన పరమేశ్వరుఁడున్ను అంతమాత్రమునకు సమర్థుఁడు కావచ్చునని కాని, అసత్తువలన ఉత్పత్తికిని, సద్వస్తువుకు నాశమునకున్ను పరమేశ్వరుఁడున్ను సమర్థుఁడు కానేరఁడని అభిప్రాయము. ఈలాగని సత్కార్యవాదిపక్షము ఒకటవది.

అదేప్రకారము మరియొకఁడు సుగతమతానువర్తి (బౌద్ధుఁడు) ఈసకలజగత్తు అధ్రువముక్షణికమని చెప్పుచున్నాఁడు.

సద్వస్తువునకు స్థిరత్వము సంభవింపదనియు,అర్థక్రియాకారత్వమే సత్వమనియు, అదియు నొకక్షణమందు సకలార్థక్రియలు నశింపఁగా ఉత్తరక్షణమందు లేకపోవుటచే శూన్యమే సంభవించుచున్నదని ఆపక్షమందు ఈశ్వరుఁడు గూడ క్షణికవిజ్ఞానసంతతిలోని వాఁడే కావచ్చును. అందువలన అసత్తువలన ఉత్పత్తియుం సత్తుకు వినాశము చేయుటకు ఈశ్వరుఁడు సమర్థుఁడు కానేరఁడని రెండవపక్షము. ఇది బౌద్ధమతము—అంతయు క్షణికమని.

ఆ రెండుపక్షముల నంగీకరించని మరియొక తార్కికుఁడు ఈసమస్తజగత్తు నిత్యత్వము అనిత్యత్వము కూడ గలదని, వ్యస్తవిషయమందు భిన్నధర్మము కలదని చెప్పుచున్నాఁడు. ఆకాశాదిచతుష్కము, పృథివ్యాదిచతుష్కము (పరమాణువులు నిత్యములని) లేక,ఆకాశకాలదిగాత్మమనఃపృథివ్యాదిపరమాణువులు నిత్యములని గాని, కార్యద్రవ్యము లన్నియు అనిత్యములని అందువలన, అనిత్యములయిన కార్యద్రవ్యములవిషయమై ఉత్పత్తివినాశములకు పరమేశ్వరుఁడు కర్త కావచ్చునుకాని నిత్యవస్తువులకు కర్త కానేరఁడని భావము. ఇది తార్కికమతము మూఁడవది. ఈలాగున నిది మూఁడవ పక్షము.

తథా చ. ఈమూఁడు పక్షములందును ద్వైతము పరమేశ్వరునికన్న అన్యమయిన మరియొకవస్తువు ఉన్నదనే అంగీకారమువలన, అద్వితీయుఁడైన సన్మాత్రుఁడగు పరమేశ్వరునికి దేనితోడను స్పర్శకూడ లేదని భావము.

ఓ త్రిపురహర! వెనుక చెప్పిన స్తోత్రములప్రకారము నిన్ను స్తుతించుటకు విస్మయమును పొందినవానివలె లజ్జను పొందను. లోకమందు ఆశ్చర్యకరమైనదానిని చూచి విస్మయ

మును పొందినవాఁడు తనను చూచి లోకులు నవ్వుదురని తెలి యక తాదాత్మ్యముచేత స్మారకము లేక వికారముగా నుండును. అట్లే నేను గూడ లోకులు నేఁ జేసిన స్తుతిని చూచి నన్నుపహ సింతురని లజ్జను పొందను. అని గ్రంథకర్త తన భక్తిని వెల్ల డించుచున్నాఁడు.

పరమేశ్వరునిస్తోత్రము ఉపాధితోఁ గూడినదియు పరిమితి గల ఐశ్వర్యముగల స్తోత్రములు సర్వథా అన్నివిధములను లజ్జాస్పదములే యగుచున్నవని భావము.

ఈప్రకారము నానావిధములుగా నున్న మతములకు ఆభాసత్వము చెప్పఁబడినది. పరమేశ్వరునిగుఱించి అద్వైత వాదమే లజ్జాస్పదము కాకపోవడమువలన సత్యమైనదని నిశ్చయ మగుచున్నది. ఈయంశము "త్వమర్క స్త్వం సోమ" అనెడిశ్లోక వ్యాఖ్యానమందు స్పష్టమగునని చెప్పిరి.

అవ. పూర్వోక్తప్రకారము తొమ్మిదిశ్లోకములచేత స్తుతి సామగ్రిని నిరూపించి, ప్రస్తుత స్తుతియందు సకలప్రభావముకల వారిలో నగ్రేసరులయిన బ్రహ్మవిష్ణులకుఁ గూడ నీయనుగ్రహము వలననే వారికి నీసాక్షాత్కారము సిద్ధించినదని ఈలాగున అత్యుత్తమమైన మాహాత్మ్యమును బ్రకటనసేయుచు స్తుతించు చున్నారు:—

**మూ.** తవైశ్వర్యం యత్నాద్యదుపరి విరించిర్హరిరధః
పరిచ్ఛేత్తుం యాతావనలమనలస్కంధవపుషః,
తతో భక్తిశ్రద్ధాభరగురుగృణద్భ్యాం గిరిశ య
త్స్వయం తస్థే తాభ్యాం తవ కిమనువృత్తిర్న ఫలతి.

వ్యా. ఏవం శ్లోకనవకేన స్తుతిసామగ్రీం నిరూప్య స్తుతౌ ప్రస్తుతాయాం సమస్తప్రభావవతామగ్రేసరయోర్హరివిరించ్యో రపి త్వత్ప్రసాదాదేవ త్వత్సాక్షాత్కార ఇత్యేవం నిరతిశయం మాహాత్మ్యం ప్రకటయన్ స్తౌతి.—తవేతి. హే గిరిశ, తవానువృత్తిః సేవా కిం న ఫలతి? అపి తు సర్వమేవ ఫలతి. త్వత్సాక్షాత్కారపర్యంతం ఫలం దదాతీత్యర్థః. తత్రాన్వయవ్యతిరేకాభ్యాం కారణతాం ద్రఢయితుం భగవదనుగ్రహవ్యతిరేకే ఫలవ్యతిరేకమాహ.

యదృస్మాదనలస్కంధవపుష స్తేజఃపుంజమూర్తే స్తవైశ్వర్యం స్థూలం రూపం పరిచ్ఛేత్తుమియత్తయావధారయితుముపర్యూర్ధ్వం విరించిః బ్రహ్మా అధోఽధస్తాద్ధరిర్విష్ణుః యత్నాత్ స్వప్రయత్నేన యావద్గంతుం శక్తౌ తావద్యాతౌ గతౌ అనలం నాఽలమ్. న పరిచ్ఛేత్తుం సమర్థావిత్యర్థః.

యత్ర స్థూలరూపస్యాపరిచ్ఛేద్యం తత్ర దూరే సూక్ష్మరూపపరిచ్ఛేదసంభావనా. తేన త్వదనువృత్తిం వినా హరివిరించ్యోః ప్రసిద్ధమహాప్రభావయోరపి త్వం న విజ్ఞేయ స్తత్రకా వార్తాఽన్యేషామితి వ్యతిరేకముక్త్వాఽన్వయమాహ.—తత స్తస్మాత్కారణాత్స్వయత్నవైఫల్యాదనంతరం తాభ్యాం హరివిరించిభ్యాం, "శ్లాఘహ్నుఙ్స్థాశపాం జ్ఞీప్స్యమానః" ఇతి చతుర్థీ తయోర్జ్ఞానాయేత్యర్థః. కీదృశాభ్యాం? భక్తిశ్రద్ధాభరగురుగృణద్భ్యాం. భక్తిరత్ర కాయికీ సేవా, శ్రద్ధా ఆస్తిక్యబుద్ధిః (మానసీసేవా), తయోర్భరోఽతిశయ స్తేన గురు శ్రేష్ఠం నిరతిశయం యథా తథా గృణద్భ్యాం స్తువద్భ్యాం వాచికీం సేవాం కుర్వద్భ్యాం. యద్ధి గురుతరం భవతి శిలోచ్చయాది తత్ప్లవనపర్జ

న్యాదిభిర్న విక్రియాముపైతి అలఘుద్రవ్యత్వాత్, తథా స్తుతిరప్యతిగౌరవవతీ శిలోచ్చయాదిస్థానీయా పవనపర్జన్యస్థానీయైర్విఘ్నైశ్చాలయితుం న శక్తేతి గురుశబ్దేన ధ్వనితమ్. ఏవం రూపేణ తవైశ్వర్యం స్తువద్భ్యాం తాభ్యాం కిమిత్యాహ.— స్వయం తస్థే స్వయమేవ నతు తయోః ప్రయత్నేన తస్థే స్వాత్మానం ప్రకాశయతి స్మ. అత్ర తవైశ్వర్యమితి కర్తృపదం ద్రష్టవ్యమ్. "ప్రకాశనస్థేయాఖ్యయోశ్చ" ఇత్యాత్మనేపదమ్. యద్వా గృణద్భ్యామితి కర్తరి తృతీయా. తస్థే స్థితం నివృత్తమితి భావప్రత్యయః. తతస్తయోర్నివృత్తావపి కిం తవానువృత్తిర్న ఫలతి? అపితు ఫలత్యేవేత్యర్థః తస్మాదేవ హరివిరించిభ్యామపి త్వదనువృత్త్యైవ త్వం సాక్షాత్కృతః కా వార్తాన్యేషామిత్యన్వయ ఉక్తః. ఏవం త్వదనువృత్తిరేవ సర్వం ఫలతీత్యన్వయవ్యతిరేకాభ్యాం దృఢీకృతమ్.

తా. కైలాసవాసివైన ఓసాంబమూర్తీ! అగ్నిసమూహమువంటి తేజోరూపముగల నీయైశ్వర్యము నీలింగాకారము యొక్క ఆద్యంతములను దెలుసుకొనుటకై అంతరిక్షమునకు బ్రహ్మయు, పాతాళమునకు విష్ణువును వెళ్లిరి. తమ తమ శక్తి యున్నంతమట్టుకు వెళ్లినపైని అలసి ఆపైని వెళ్లుటకు సమర్థులు కాకపోయిరి. బ్రహ్మకు అంతము దొరకలేదు, విష్ణువునకు ఆమహాలింగముయొక్క ఆదియు నగుపడలేదు. ఇద్దఱును అలసి భూలోకమునకు పూర్వప్రస్థానమునకు వచ్చి ఉభయులున్ను జ్ఞానముకలవారై ఇట్లు అన్యోన్యము యోచించిరి.

మనము పరమేశ్వరునిమాయవలన మోహితులమై పరమేశ్వరుని యైశ్వర్యము నెఱుఁగక భ్రమనుపొంది వారితేజోలిం

గముయొక్క ఆద్యంతములను దెలుసుకొనుటకు సిద్ధపడినాము. వృథాగా శ్రమపడినాము. వారిమహిమకు ఆద్యంతములు లేవు; అపారమైనది. మనము గర్వపడి వారిని మనవలెనే పరిమితి గల వారినిగా తలంచడము మనకు గొప్ప అపరాధము. దీనిని క్షమించి నీభక్తుల మగు మమ్మును రక్షింపుమని ఉభయులు పశ్చాత్తాపము కలవారై ఆతేజోలింగమున కెదురుగా చేతులు జోడించుకొని త్రికరణయా భక్తికలవారై పరమేశ్వరుని స్తోత్రముచేయుచు నిశ్చలులై యుండిరి.

వీరిచర్య యంతయు ఆలింగాకారముగా నున్నపరమేశ్వరుఁడు చూచి వీరియందు దయాళువై ఆలింగమధ్యమునుండి వీరికి ఎదురుగా సాక్షాత్కరించెను. భక్తవాత్సల్యముగల పరమేశ్వరుని వీరు స్తుతింపఁగా సంతోషించి జగత్సృష్టిసామర్థ్యమును బ్రహ్మకును, జగత్పరిపాలనసామర్థ్యమును విష్ణువునకు ననుగ్రహించెను.

వీరు దురహంకారము కలిగి వారి ఆద్యంతములు చూతమని తలంచినపుడు దొరకలేదు అహంకారమును విడిచి వారిని శరణుపొందినపుడు వీరుకోరకయే తమంతట తామె వీరికిఁ బ్రత్యక్షమయిరి. కనుక నిన్ను త్రికరణయా సేవించినపుడు నీసేవ ఎందుకు ఫలించదు? ఫలించియే తీరునని భావము. కరణత్రయమనఁగా:— ఆస్తిక్యత మానసికసేవ, వాక్కుచేత స్తోత్రాదికము వాచికసేవ, పూజోపచారాదులు కాయికసేవ. ఇట్లు పురాణములందును ఈ కథ ప్రసిద్ధముగా నున్నది.

ఇట్లు అన్వయవ్యతిరేకములచేఁ బరమేశ్వరుని ఐశ్వర్యము అపారమని స్తుతించిరి. బ్రహ్మ-విష్ణులు రజస్తమోగుణ

ములు కలవారైనందున ఈశ్వరమహిమను తెలుసుకొందమని ప్రయత్నించి అసమర్థులై నమ్రులైనందున వారిమహిమ అపార మని తెలియుచున్నది. ఇది వ్యతిరేకముచే స్తుతించుట.

ఇక అన్వయము. వీరు పశ్చాత్తాపముగలవారై వారిని శరణుపొంది అపరాధమును క్షమింపుమని ప్రార్థించుచు వారిలింగ సన్నిధిని స్తోత్రముచేయుచుండఁగా వారు కోరనిదే అప్రయత్న ముగా వారు సాక్షాత్కారమైనారు. ఇది అన్వయరూపము.

అవ. రాక్షసుఁడైన రావణునకు సైతము పరమేశ్వరాను గ్రహమును చూపించుచు, ఈశ్వరుని స్తుతించుచున్నారు:—

**మూ.** అయత్నాదాపాద్య త్రిభువనమవైరవ్యతికరం
దశాస్యో యద్బాహూనభృత రణకండూపరవశాన్,
శిరఃపద్మశ్రేణీరచితచరణాంభోరుహబలేః
స్థిరాయా స్త్వద్భక్తేస్త్రిపురహర విస్ఫూర్జితమిదమ్.౧౧

వ్యా. అథ రావణస్యాపీశ్వరానుగ్రహాదేవ సర్వోన్న తత్వం దర్శయన్ స్తౌతి.—అయత్నాదితి. హే త్రిపురహర, స్థిరాయాః నిశ్చలాయా స్త్వద్భక్తేస్తవ సేవాయాః విస్ఫూర్జిత మిదం ప్రభావోఽయమ్. కిం విశిష్టాయా స్త్వద్భక్తేః? శిరఃపద్మ శ్రేణీరచితచరణాంభోరుహబలేః. శిరాంస్యేవ పద్మాని అర్థాద్రావ ణస్య తేషాం శ్రేణీ పంక్తిస్తయా రచితః కల్పితశ్చరణాంభోరు హయోః పాదపద్మయోర్బలిరుపహారో యస్యాం సా తథా. రావణేన హి నవభిర్నిజశిరోభిః స్వహస్తకృత్తైః శంభోరుపహారః కృత ఇతి పురాణప్రసిద్ధమ్. కిం తద్విస్ఫూర్జితమిత్యత ఆహ— యత్ దశాస్యో రావణో బాహూన్వింశతిభుజాన్. కీదృశాన్?

రణాయ యుద్ధాయ కండూః ఖర్జూః. అతిస్పృహేతి యావత్. తథా పరవశాం స్తదధీనానభృత ధృతవాన్. రణకండూర్హి రణే నైవ నివర్తతే. రణాసంభవాచ్చ సర్వదా కండూరేవ తద్భుజే ష్వితి భావః. తర్హి రణం సంపాద్య కిమితి తత్కండూం న నివర్త యతీతి చేన్న, ప్రతిమల్లాభావాదిత్యాహ.—

త్రిభువనం త్రైలోక్యమవైరవ్యతికరం న విద్యతే వైరస్య విరోధస్య వ్యతికరః కారణం దర్పాది యత్ర తత్తథా ఆపాద్య సంపాద్య. త్రైలోక్యవర్తినో వీరానింద్రాదీన్స్వదాస్యం నీత్వే త్యర్థః. తదప్యయత్నాదయత్నేనైవ స్వయమేవ రావణపరా క్రమం శ్రుత్వా సర్వే వీరాః దర్పాదికం త్యక్తవంత ఇత్యర్థః.

తథా చానాయాసేనైవ నిర్జితత్రిజగతో రావణస్య భుజానాం కండూర్నైవ శాంతేత్యేష శౌర్యాతిశయో భగవ ద్భక్తేరేవ ప్రభావః ఇత్యర్థః. "ఆసాద్య" ఇతి క్వచిత్పాఠః. తస్య ప్రాప్యేత్యర్థః.

తా. హే త్రిపురహర! రావణాసురుఁడు అప్రయత్న ముగా మూఁడు లోకములందును దనకు శత్రువు లేనట్లు చేసి యుద్ధసంబంధమైన దురదవలన పరవశమైన బాహువులను ధరిం చెను. రావణున కిట్టిపరాక్రమము కలుగుటకుఁ గారణ మేమనినః తన శిరస్సులను తొమ్మిదింటిని తన గండ్రకత్తెరతో ఖండించి తన దోసిలిలో నుంచుకొని ఒక్కశిరస్సుతో నుండి నీపాదారవిందములందుఁ బూజచేసినాఁడు. నీయందుఁ గల భక్తి యొక్క ఉద్రేకమువలన నిట్టి సాహసము చేసినందున నీయను గ్రహము వానియందుఁ గలిగినది. ఇదంతయు నీయనుగ్రహము

వలననే రావణునికిఁ గలిగినదని, రావణునిపరాక్రమము ఐశ్వర్యము నీభక్తిప్రభావమని స్తుతించిరి.

అవ. వెనుకటి శ్లోకముచేత ఈశ్వరభక్తిగలరావణునికిఁ గల బలైశ్వర్యాదికము నీభక్తిప్రభావమని అనుగ్రహమును నిరూపించి, ఇందు నిగ్రహమును నిరూపించుచు స్తుతించుచున్నారు:—

మూ. అముష్య త్వత్సేవాసమధిగతసారం భుజవనం
బలాత్కైలాసేఽపి త్వదధివసతౌ విక్రమయతః,
అలభ్యా పాతాలేఽప్యలసచలితాంగుష్ఠశిరసి
ప్రతిష్ఠా త్వయ్యాసీద్ధ్రువముపచితో ముహ్యతి ఖలః

వ్యా. ఏవం రావణస్యైశ్వర్యం త్వద్భక్తివశాల్లబ్ధానుగ్రహం నిరూప్య త్వయి దర్పస్య ఫలం నిగ్రహం ప్రదర్శయన్ పరమేశ్వరం స్తౌతి:—అముష్యేతి. హే త్రిపురహర, అముష్య పూర్వశ్లోకోక్తస్య రావణస్య ప్రతిష్ఠా స్థితిః త్వయి అలసచలితాంగుష్ఠశిరసి సతి పాతాలేఽప్యలభ్యా ఆసీత్. అలసం మందం యథా స్యాత్తథా చలితం కంపితం అంగుష్ఠశిరోఽంగుష్ఠాగ్రం యేన స తథా తస్మిన్. చలితమితి హ్రస్వత్వం చ కంపితేశ్చలతేర్మిత్వానుశాసనాత్. తథా చ తవాంగుష్ఠకంపనమాత్రేణైవ తస్య వీరాభిమానినోఽధఃప్రవేశోఽశక్యప్రతికార ఆసీదిత్యర్థః. అముష్య కిం కుర్వతః? త్వదధివసతావపి కైలాసే తవ మందిరేఽపి స్ఫటికగిరౌ భుజవనం భుజబృందం వింశతిసంఖ్యాకం బలాద్విక్రమయతోఽతిశౌర్యేణ వ్యాపారయతః. ఇమముత్పాట్య లంకాయాం నేష్యామీత్యభిప్రాయేణ భుజచేష్టాం కుర్వత ఇత్యర్థః.

కీదృశం భుజవనం? త్వత్సేవాసమధిగతసారం తవ సేవయా సమధిగతః ప్రాప్తః సారో బలం యేన తత్తథా. త్వత్ప్రసాదేనైవ బలమాసాద్య త్వద్గృహముత్పాటయతీత్యహో కృతఘ్నతా మాఢ్యం చేత్యభిప్రాయః. ఏవం హి పురాణప్రసిద్ధం "భగవత్ప్రసాదాదాసాదితబలేన రావణేన స్వబలపరీక్షార్థం భగవన్నివాసస్యాపి కైలాసస్యోత్పాటనమారబ్ధం. తతశ్చ పార్వత్యా భీతయా ప్రార్థితో భగవాన్కైలాసస్యాధోగమనార్థం అంగుష్ఠాగ్రమాత్రం శనైర్వ్యాపారయామాస. తావన్మాత్రేణైవ క్షీణబలో రావణః పాతాళం ప్రవివేశ. పునశ్చ భగవతా కరుణయా సముద్ధృతః" ఇతి. నను భగవత్ప్రసాదాల్లబ్ధవరో రావణః కథం భగవంతం తదానీం విస్మృతవానిత్యత ఆహ.—ధ్రువం నిశ్చితం ఉపచితస్సమృద్ధస్సన్ ఖలః కృతఘ్నో ముహ్యతి కృతం విస్మరతి. స్వోపచయహేతుమపి న గణయతీత్యర్థః.

తా. ఓత్రిపురహార! నీయొక్క సేవవలనఁ బొందఁబడిన బలముగల వనసమానమైన ఇరువదిభుజములను బలవంతముగా నీకు నివాసస్థానమైన కైలాసమునందుఁ గూడ తన పరాక్రమమును చూపించుచున్న ఈ రావణుండు కైలాసమందు నీవు ఉండఁగా ఆలోచించక భుజబలగర్వముచేత దానిని పెల్లగించి తన లంకలోనికిఁ దీసికొనిపోవు దురుద్దేశము కలవాఁడై దానిని పెల్లగించుతఱి పర్వతము కదిలినది. అందువలన పార్వతి భయపడి నిన్ను బ్రార్థింపఁగా నీవు కాలిబొటనవ్రేలును నిమ్మళముగా క్రిందికి నొక్కినపుడా కైలాసము భూమిమీఁద మామూలు ప్రకారముండఁగా ఈ రావణుఁడు దానిక్రింద పడి పాతాళలోకమందును ఉనికిలేక ఇంకయుఁ గ్రిందికిఁ బోవుచు నిన్నుఁ బ్రార్థిం

బలిసుతః. కీదృశః? పరిజనవిధేయత్రిభువనః. పరిజనో దాసస్తద్వ ద్విధేయం, వశ్యం త్రిభువనం యస్య, పరిజనానామివ విధేయం వశ్యం త్రిభువనం యస్యేతి వా. స తథా ఉచ్చైస్సతీం యదధశ్చక్రే తదన్యత్ర చిత్రమపి తస్మిన్బాణే న చిత్రం నాశ్చర్యం. కీదృశే? త్వచ్చరణయోః వరివసితరి నమస్కర్తరి ఇంద్రసంపత్తేర ప్యధః కరణం త్వన్నమస్కారస్య న పర్యాప్తఫలం కింత్వేకదేశ మాత్రమిత్యాహ—న కస్యా ఇతి. త్వయి విషయే శిరసో యావనతిః నమస్క్రియా సా కస్యై ఉన్నత్యై న భవతి? అపి తు సర్వామేవోన్నతిం మోక్షపర్యంతాం జనయితుం సమర్థా భవత్యేవేత్యర్థః

అవనతిరప్యున్నతిహేతురిత్యతిశయోక్తిసంకీర్ణోఽయమర్థాంతరన్యాసః. సర్వోత్కృష్టత్వమచింత్యమహిమత్వం చ భగవతస్సూచయతీతి భావః.

తా॥. హేవరద! నీభక్తులకు సకలకోరికల నిచ్చెడిపరమేశ్వర! మూఁడులోకములలో జనులను తనకు పరిచారకులుగా చేసిన బలికుమారుఁడైన బాణాసురుఁడు నీభక్తుఁడైనందున, పరమోచ్చగానున్న ఇంద్రునియైశ్వర్యమును గూడఁ గ్రిందుగాఁ జేసెను-తిరస్కరించెను.ఆబాణాసురునిగుఱించి అది చిత్రము కాదు.. ఎందువల్లననఁగా: నీపాదారవిందములందు నమస్కరించెడివానికి ఇంద్రసంపత్తిని తిరస్కరించుట గొప్ప కాదు.అట్టినమస్కారమునకు ఏకదేశమాత్ర ఫలము పూర్తిఫలము కాదు. ఎందువల్లననఁగా: ఎవని శిరస్సు నీవిషయమై వంగుచున్నదో అట్టి ఎవనికి ఔన్నత్యముకొఱకు కాదు? నీయందు నమ్రుఁడైనవాఁడు సర్వోన్నతిని పొందుచున్నాఁడని భావము.

ఇట్లు బాణాసురుఁడు రాక్షసుఁడైనను అత్యంత శివభక్తి కలవాఁడైనందున, మూఁడులోకములను జయించి అత్యున్న తైశ్వర్యము కలవాఁడై యొప్పునట్టు లనుగ్రహించినావు. ఇదం తయు నీనమస్కారఫలమని స్తుతించినారు.

అవ. ఇట్లు రాక్షసులైనను పరమశివభక్తులయిన రావణ-బాణాసురులు పరశివు నారాధించి, వారియనుగ్రహము వలన మూఁడులోకములను జయించి, అత్యున్నతైశ్వర్యమును బొందిరని ఈశ్వరానుగ్రహనిగ్రహములుగల వారిమహిమను వర్ణించి, ఇందు కాలకూటభక్షణరూపమైన ఈశ్వరమహిమను చూపించుచు స్తుతించుచున్నారు:—

**మూ. అకాండబ్రహ్మాండక్షయచకితదేవాసురకృపా**
**విధేయస్యాసీద్యస్త్రినయన విషం సంహృతవతః,**
**స కల్మాషః కంఠే తవ న కురుతే న శ్రియమహో**
**వికారోఽపి శ్లాఘ్యో భువనభయభంగవ్యసనినః. ౧౪**

వ్యా. అధునా కాలకూటసంహారం దర్శయన్ శంకరం స్తౌతి:—అకాండేతి. హే త్రినయన, విషం సముద్రమథనో ద్భూతం కాలకూటాఖ్యం గరలం సంహృతవతః పీతవతస్తవ కంఠే యః కల్మాషః కాలిమాసీత్స కాలిమా తవ కంఠే శ్రియం శోభాం న కురుతే కిం? అపి తు కురుత ఏవేత్యర్థః. నను భగవా నతిశయితవిశేషదర్శీ మహానర్థహేతుకం విషం కిమితి పీతవా నిత్యత ఆహ—అకాండ ఇతి. అకాండేఽసమయే బ్రహ్మాండ క్షయో మహాప్రళయో విషోర్మివేగాత్సంభావితస్తస్మాచ్చకితా భీతా దేవాసురా ఇంద్రబలిప్రభృతయః తేషు కృపా దయా

తయా విధేయస్య వశ్యస్య, అన్యస్యైతత్పానే సామర్థ్యం నాస్తీతి విశ్వత్రాణాయ విషం స్వయమేవ పీతవానిత్యర్థః. నను విష వికారాత్కల్మాషః కథం కంఠే శోభాం తనోతీత్యత ఆహ.—అహో ఇత్యాది. అహో ఆశ్చర్యే, భువనభయభంగవ్యసనినః పరమేశ్వరస్య వికారోఽపి శ్లాఘ్యః ప్రశంసనీయః. భువనస్య లోకస్య భయం త్రాసస్తస్య భంగో నిరన్వయనాశః స ఏవ వ్యసనం సర్వమన్యద్విహాయ క్రియమాణత్వాద్వ్యసనం తదస్యాస్తీతి తథా తస్య. తేన జగదుపకృతికృతం దూషణమపి భూషణమేవేత్యర్థః.

తా. త్రినేత్రుఁడవైన ఓశంకరా! అకాలమందుఁ గలిగిన బ్రహ్మాండక్షయమునకు భయపడుచున్న దేవాసురులయందుఁ గలిగిన అనుగ్రహమువలన వశ్యుఁడవై కాలకూటవిషమును పానముచేసిన నీకు నీయొక్క కంఠమందుఁ గల నలుపుమచ్చ వికారమును గల్గింపదు. మరి ఏమనఁగా: ఆమచ్చ కంఠమందు శోభనే కలుగఁజేయుచున్నది. ఎందువల్లననఁగా: సకలభువనములకును ఉపద్రవమును, భయమును గలిగినప్పుడు దానిని బోఁగొట్టుటకుఁ బ్రయత్నించినవారికి వికారము గూడ నలంకారమే యగుచున్నది.

అవ. వెనుకటిశ్లోకమందుఁ బరమేశ్వరునిదయాళుత్వమును వర్ణించి యిందు వారికి అపకారము తలఁచినవానిఫలమును జూపించుచు వారిజితేంద్రియత్వమును వర్ణనరూపముగా స్తుతించుచున్నారు:—

**మూ.** **అసిద్ధార్థా నైవ క్వచిదపి సదేవాసురనరే**
**నివర్తంతే నిత్యం జగతి జయినో యస్య విశిఖాః,**

స పశ్యన్నీశ త్వామితరసురసాధారణమభూత్
స్మరః స్మర్తవ్యాత్మా న హి వశిషు పథ్యః పరిభవః. ౧౫

వ్యా. ఏవం పరమేశ్వరస్య అతిదయాళుత్వం ప్రదర్శ్యాత్ర తస్మిన్నపకృతిస్మర్తుః ఫలం చాస్య జితేంద్రియత్వం చ వర్ణయన్ స్తౌతి:—అసిద్ధార్థ ఇతి. హే ఈశ, యస్య స్మరస్య విశిఖాః బాణాః సదేవాసురనరే జగతి దేవాసురాదిసహితే త్రైలోక్యే జయినః ఉత్సృష్టాః క్వచిదప్యసిద్ధార్థా అకృతకార్యా న నివర్తంతే. అపి తు సిద్ధార్థా ఏవ నిత్యం జయిన యేవ భవంతి. జయిన ఇతి స్మరస్య వా విశేషణం. నిత్యం జయశీలస్యేత్యర్థః. స ఏతాదృశపౌరుషవానపి స్మరః యథాఽన్యే దేవా మమ జయ్యాస్తథాఽయమపీతీతరదేవతుల్యం త్వాం పశ్యన్ స్మర్తవ్యాత్మాభూత్ స్మర్తవ్యః స్మరణీయ ఆత్మా శరీరం యస్య స తథా. నష్ట ఇత్యర్థః. పశ్యన్నితి హేతౌ శతృప్రత్యయః. లక్షణహేతౌ చ శతృస్మరణాత్ "తద్ధైతత్పశ్యన్నృషిర్వామదేవః ప్రతిపేదే" ఇతివత్. తేనేతరదేవసాధారణత్వేన త్వద్దర్శనమేవాస్యవధానేన వినాశహేతుః కా వార్తా పరిభవాదేరితి భావః.

తత్ర కైముతికన్యాయమాహ.— నహీత్యాది. హి యస్మాద్వశిషు జితేంద్రియేష్వన్యేష్వపి పరిభవస్తిరస్కారః పథ్యో హితో న భవతి. స్వనాశాయైవ సంపద్యత ఇతి యావత్. కిం పునః పరమవశినాం వరే పరమేశ్వరే త్వయీత్యర్థః.

తా. ఓశంకర! ఏమన్మథునియొక్క బాణములు దేవతలు రాక్షసులు మనుష్యులతోఁ గూడియున్న యీజగత్తునందు విడువఁబడినవై యెప్పుడును వ్యర్థములై మరలివచ్చుటలేదో— ఎప్పుడును జయముకలవే అగుచున్నవో—అట్టి మన్మథుం డో

పరమేశ్వరా! నిన్ను ఇతరదేవతలతో సమానముగా తలంచిన మాత్రముననే స్మరింపఁదగిన శరీము కలవాఁడై నాఁడు—నశించి నాఁడని భావము. నిన్ను సామాన్యునిగా స్మరించినమాత్రాన తత్క్షణమే భస్మమయినాఁడు గదా. ఇఁక నీతిరస్కారాదులు చేసిన వారిఫల మెంతయో తెలియదు. లోకమందు సామాన్యముగా జితేంద్రియులైన మహాత్ములనుగురించి తిరస్కారము చేసినవారికే యెట్టి శ్రేయస్సును గల్గకపోవుచుండఁగాఁ బరమజితేంద్రియాగ్రేసరుఁడవగు నీ కపకారము తలఁచి మన్మథుఁ డిట్లు నామమాత్రావశిష్టుం డగుట యొక యాశ్చర్యము కాదని భావము.

ఇందువలన పరమేశ్వరుని జితేంద్రియత్వమును పరమేశ్వరున కపకారము తలఁచినవారికిఁ గల్గెడి ఫలమును దెలియుచున్నవని వారిని స్తుతించినారు.

అవ. ఈశ్లోకమందు పరమేశ్వరుఁడు లోకసంరక్షణార్థమై నిత్యము ప్రదోషకాలమందు సల్పెడి మహాతాండవమును వర్ణించుచు స్తుతించుచున్నారు:—

**మూ.** **మహీ పాదాఘాతాద్వ్రజతి సహసా సంశయపదం**
**పదం విష్ణోర్భ్రామ్యద్భుజపరిఘరుగ్ణగ్రహగణం,**
**ముహుర్ద్యౌర్దౌస్థ్యం యాత్యనిభృతజటాతాడితతటా**
**జగద్రక్షాయై త్వం నటసి నను వామైవ విభుతా. ౧౬.**

వ్యా. అథ జగద్రక్షణార్థం పరమేశ్వరస్య ప్రదోషకాలకృతనర్తనం వర్ణయన్ శంకరం స్తౌతి:—హే ఈశ, జగద్రక్షాయై త్వం నటసి నృత్యసి. సంధ్యాయాం జగంతి జిఘాంసంతం వరలబ్ధతాత్కాలబలం మహారాక్షసం నిజతాండవేన మోహాయ

నీత్యర్థః. త్వం తు జగతాం రక్షాయై నృత్యసి, జగంతి తు త్వత్తాండవేన సంశయితాని భవంతీత్యాహ.—మహీత్యాది. తవ చరణాఘాతేన సహసా సంశయపదం సంకటం మహీ వ్రజతి. తథా విష్ణోః పదమంతరిక్షం భ్రామ్యద్భుజపరిఘరుగ్ణగ్రహగణం భుజా ఏవ పరిఘాః అతిసువృత్తపీవరదృఢదీర్ఘత్వాత్తైర్భ్రామ్యద్భి ర్భుజరూపపరిఘైః రుగ్ణాః పీడితాః గ్రహగణా నక్షత్రసమూహో యత్ర తత్తథా సంశయపదం వ్రజతీత్యర్థః. యథా ద్యౌః స్వర్లో కోఽపి అనిభృతా అసంవృతా యా జటాస్తాభిస్తాడితం తటం ప్రాంతదేశో యస్యాస్సా తథా ముహుర్దౌస్థ్యం దుఃస్థత్వం యాతి. ఏవం చ క్రమేణ త్రయాణాం లోకానామపి సంశయో దర్శితః. నన్వసౌ సర్వజ్ఞోఽప్యపాయమపర్యాలోచయన్నేవ కిమిత్యేవంవిధతాండవే ప్రవృత్త ఇత్యత ఆహ.—నన్వితి. నను అహో విభుతా పరమమహత్తా, ప్రభుతేతి యావత్. వామైవ ప్రతికూలైవ. అనుకూలమాచరత్యపి కించిత్ప్రతికూలమవశ్య మాచరతీత్యేవశబ్దార్థః. దృశ్యతే హి స్వల్పకేఽపి రాజని స్వదేశ రక్షణాయ సేనయా సహ సంచరతి స్వదేశోపద్రవః, కిముత తాదృశే మహేశ్వర ఇత్యర్థః.

తా. ఓశంకరా! నిత్యము ప్రదోషకాలమందు నీవు చేయుచున్న మహాతాండవము అత్యాశ్చర్యముగా నున్నది. నీప్రభుత్వము నీమహిమ అనంతమై వర్ణింప శక్యము కానిదై యొప్పు. నీప్రభుత్వము లోకోపకారకమైనను కించిత్తు బాధకముగా నుండును. ఆతాండవ మెట్టిది? అట్టి గొప్పతాండవ మెందుకు నిత్యము చేయుచున్నాఁడనిన:—పూర్వకాలమందు మహాపరాక్రమశాలి యగునొకరాక్షసుఁడు ప్రదోషకాలమందు

తనకు అధికబలము కల్గెడి లాగున బ్రహ్మవలన వరముఁ బొంది నిత్యము ఆకాలమందు మూఁడులోకములకు బాధ కలుగఁజేయు చుండెను. వాని నెవ్వరు జయింపలేకపోయిరి. ఇంద్రాదిదేవతలు పరమేశ్వరుని బ్రార్థింపఁగా వానితో యుద్ధమక్కఱలేకుండనే మహాతాండవము చేయఁగా వాఁడది చూచి యాశ్చర్యపడి మోహితుఁడయి జగత్తులను బాధించుట మఱచినాఁడు. కనుక జగద్రక్షణకొఱకే యీమహాతాండవారంభము. అదెట్టిదనినః ఆనృత్యారంభకాలమందు మూఁడులోకములకు వ్యాపించిన శరీరము కలవారై నృత్యము చేయఁగా వారిపాదఘట్టనవలన భూమి పరాగరూపమై పోవునాయేమి అని లోకులకుఁ దోఁచుచున్నది. ఆకాలమం దభినయముచేయుటవలనను, చక్రాకారముగా తిరుగుటవలనను, వారిహస్తములు గదలవంటివై వలము దృఢము పొడవు కలవైనందునను, వాటివేగముచేత నక్షత్రములు గ్రహమండలములు కూడ చలించి అంతరిక్షమందు తిరుగుచున్నవి. వారిజడలు వలము పొడవు దృఢము కలిగినందున,జడలు విచ్చి తిరుగఁగా వాటిదెబ్బలచేత స్వర్గప్రాంతదేశములును దిక్కులును బ్రద్దలగుచున్నవి. ఇట్లు మూఁడులోకములకు వ్యాపించిన శరీరము కలవాఁడై నిత్యము ప్రదోషకాలమందు మహోత్సాహముతో నృత్యముచేయుచున్నాఁడు. ఇట్లు మూఁడులోకములకు బాధగా నుండునట్లు వారు ఎందుకు చేయవలెననినః—గొప్ప బాధను పోఁగొట్టుటకై ప్రయత్నించినప్పుడు కొంచెము శ్రమ కలుగును. దానికి సహించినచో గొప్పఫలమును లాభమును గలుగును. ఔషధములును, కషాయములును చేదుగా నుండునుగాని తరువాత చాల గుణము నిచ్చును. అట్టులే ప్రభువులవలనను

కొంచెము లోకమునకు శ్రమయున్నను వారివలననే లోకములు క్షేమముగానున్నవి. ఆతాండవకాలమందు బ్రహ్మ, విష్ణు,ఇంద్రాది దేవతలు, సరస్వతి మొదలగు దేవతాస్త్రీలు తాళములు మృదంగము మొదలగు వాద్యముల మ్రోయించుచు వారిసన్నిధిని వారిని భజించుచుందురు. ఇందువలన మూఁడులోకములవారును రాక్షసబాధ లేక సుఖముగా నున్నారని స్తోత్రము చేసిరి.

అవ. ఈశ్లోకమందు గంగావతరణమును, బరమేశ్వరుఁడు శిరస్సునందు గంగను ధరించుటను వర్ణించుచు నీశ్వరుని స్తుతించుచున్నారు:—

మూ. వియద్వ్యాపీ తారాగణగుణితఫేనోద్గమరుచిః
ప్రవాహో వారాం యః పృషతలఘుదృష్టశ్శిరసి తే,
జగద్ద్వీపాకారం జలధివలయం తేన కృతమి
త్యనేనైవోన్నేయం ధృతమహిమ దివ్యం తవ వపుః.

వ్యా. అథ గంగాయాః ఉద్ధారధారణే వర్ణయన్ శంకరం స్తౌతి.—వియదితి. హేఈశ, అనేనైవ లింగేన తవ దివ్యం దివి భవం సర్వదేవనియంత్రు వపుః శరీరం ధృతమహిమ సర్వేభ్యోఽపి మహత్తరం ఉన్నేయం ఊహనీయం. తవ వపుషః సర్వమహత్తరత్వమేతావతాపి నిశ్చేతుం శక్యం కిమితి ప్రమాణాంతరమత్రాపేక్షితవ్యమితి ఏవకారార్థః. ఇతిశబ్దః ప్రకారార్థే. ఏవంప్రకారేణ లింగేనేత్యర్థః. తమేవ ప్రకారం దర్శయతి.—వియదిత్యాది. వియదాకాశం వ్యాప్నోత్యాచ్ఛాదయతీతి తథా తారాగణేన నక్షత్రబృందేన స్వాంతఃపాతినా గుణితా శుభ్రత్వాదిగుణసజాతీయత్వాద్వర్ధితా ఫేనోద్గమరుచిర్యస్య స తథా ఏతాదృశో

వారాం ప్రవాహ స్తవ శిరసి పృషతలఘుర్దృష్టః పృషతాద్బిందో రపి లఘుః అల్పతరః పృషతలఘుః స ఇవ దృష్టః ఆలోకితః. తేన తు వారాం ప్రవాహేణ జలధివలయం జగద్ద్వీపాకారం కృతం జలధీనాం బృందం జగద్భూలోకో ద్వీపాకారం జంబూద్వీపాది సప్తకరూపం యస్మిన్ తత్తథా విహితం. "అగస్త్యేన హి సప్తసు సముద్రేషు పీతేషు పునర్భగీరథానీతగంగాప్రవాహేణైవ తేషాం పూరణం జాతం." ఇతి పురాణప్రసిద్ధం. తథా చ యో జలరాశిస్తవ శిరసి బిందోరప్యల్పో దృష్టః స ఏవాత్ర వియన్మందాకినీ నామా వియద్వ్యాప్యాస్తే, కియాన్భాగీరథీతి గంగేతి చ ప్రసిద్ధో భూలోకే సప్తసముద్రానాపూర్యాస్తే, కియాం స్తు భోగవతీతి సంజ్ఞయా పాతాలమభివ్యాప్యాస్తే ఇత్యనేన తవ దివ్యవపుషో మహత్త్వమనుమీయత ఇత్యర్థః.

తా. ఓపరమేశ్వరా! ముందు చెప్పఁబోవు కారణముల ననుసరించి నీశరీర మింత యని యూహించ శక్యముకాని ఆకారమును ధరించినదే అగుచున్నది. ఎందువల్లననఁగా: నీశిరస్సుమీఁద నున్న గంగానది అంతరిక్షమం దున్నందున నక్షత్రములతో సమానమగు ధావళ్యముగల నురుఁగులతోఁ గూడి నీ శిరస్సునందలి జలప్రవాహము లోకుల కొక బిందువుకన్న చిన్నదిగా నగుపడుచున్నది. అట్టి జలప్రవాహము మరియు నాలుగు వైపులను పరిఘగా నున్న సముద్రముగల యీ జగత్తును (భూమండలమును) జంబూద్వీపము మొదలగుసప్తద్వీపములుగఁ జేయుచున్నది. ఇట్లు నీశరీరము నక్షత్రమండలమందు శిరస్సు కలదిగనుకనే ఆజలప్రవాహమందున్న ఫేనము నురుఁగులకు నక్షత్రముల సంబంధము కలిగినదని యూహింపఁబడుచున్నది.

మరియు పూర్వము అగస్త్యులు సప్తసముద్రములను పానము చేయఁగా మరి కొంతకాలమునకు భగీరథుఁడు గంగానదిని భూలోకమునకుఁ దీసికొనిరాఁగా గంగ సప్తసముద్రములను మరల బూరించియున్నది. (నిండియున్నది.) ఈశ్వరశిరస్సునందున్న జల ప్రవాహములోనిది కొంత దేవలోకమునందు మందాకినీ అనెడి వాడుక కలదిగను, మరికొంత భూలోకమందు భాగీరథి గంగ అనెడినామములు కలదిగను, మరి కొంత పాతాళలోక మందు భోగవతి యనెడి నామముతోడను నొప్పుచుండును. ఇట్లు మూఁడులోకములను సప్తసముద్రములను పూరించి వ్యాపించినయున్న జలరాశి లోకమునకు చిన్న బిందువులో కొంతగా నగుపడుచు జగత్తును సప్తద్వీపములుగాఁ జేయుచున్నందున, ఈఅంశములను అనుసరించి చూడఁగా, నీశరీరమునందు సప్త సముద్రములు, సప్తద్వీపములు, భూరాదిసకలజగత్తు నున్నట్లు స్పష్టమగుచున్నది. ఇందువలన నీశరీర మెంత పరిమితి గలదో ఊహింప శక్యము కాదు. కనుకనే నీదివ్యశరీరము గొప్ప మహిమను ధరించినదని తెలియుచున్నది.

ఇందుకు ఆగమరహస్యము.

శ్రు. "సర్వం ఖల్విదం బ్రహ్మ నేహ నా నాస్తి కించన" "జ్యాయాన్ పృథివ్యా జ్యాయానంతరిక్షాత్." భూమికన్న గొప్పదని అంతరిక్షముకన్న గొప్పదని వేదప్రమాణము. ఈసకలము బ్రహ్మమాత్రమని అది లేనిది స్వల్పమైనను లేదనియుఁ బ్రమాణములు. ప్రకృతమందు గ్రంథకర్త స్తుతించుచున్నది పరబ్రహ్మ యొక్క సగుణస్వరూపము. నిర్గుణబ్రహ్మమే భక్తజనానుగ్రహార్థము నవీనస్వరూపమును ధరించినారుగనుక వారికి ఇవన్నియు స్తుతి

మాత్రములు కావు. యథార్థములుగానే యున్నవని భావము. వారి నిర్గుణస్వరూపము చిదాకాశరూపముగా నున్నందున ఆచిదాకాశమందు పంచభూతములు సకలజగత్తు ఉన్నదని భావము.

అవ. పరమేశ్వరునిచేఁ జేయఁబడిన త్రిపురసంహారమును వర్ణించుచు నీశ్వరుని స్తుతించుచున్నారు:—

**మూ. రథః క్షోణీ యంతా శతధృతిరగేంద్రో ధనురథో**
**రథాంగే చంద్రార్కౌ రథచరణపాణిశ్శర ఇతి,**
**దిధక్షోస్తే కోఽయం త్రిపురతృణమాడంబరవిధి**
**ర్విధేయైః క్రీడంత్యో న ఖలు పరతంత్రాః ప్రభుధియః.**

వ్యా. త్రిపురసంహారం వర్ణయన్మహేశ్వరం స్తౌతి:— రథ ఇతి. హే ఈశ, త్రిపురతృణం దిధక్షోస్తవ కోఽయమాడంబరవిధిః? త్రయాణాం పురాణాం సమాహారస్త్రిపురం తదేవ తృణం అనాయాసనాశ్యత్వాత్తం దగ్ధుమిచ్ఛోః స్తవ కేయం మహత్ప్రయోజనముద్దిశ్యేవ సంభ్రమరచనా? న హి లౌకికా అపి నఖచ్ఛేద్యే కుఠారం పరిగృహ్ణంతి. అతస్తవాత్యల్పే ప్రయోజనే న మహాన్ ప్రయాస ఉచిత ఇత్యర్థః. ఆడంబరవిధిమేవ దర్శయతి.—రథ ఇత్యాదినా. క్షోణీ పృథివీ రథరూపేణ పరిణతా, శతధృతిః బ్రహ్మా యంతా సారథిః, అగేంద్రః పర్వతశ్రేష్ఠో మేరుః ధనుః కోదండం, సోమసూర్యౌ ద్వే చక్రే, రథచరణం చక్రం తద్యుక్తపాణిర్విష్ణుః శరో బాణః. చతుర్థవాక్యే శ్రుతోఽప్యథశబ్దస్సర్వత్ర వాక్యభేదాయ యోజనీయః. ఇతిశబ్దః ప్రకారార్థః. త్రిభువనమపీచ్ఛామాత్రేణ సంహారతస్తవైవం ప్రకా

రేణ సామగ్రీసంపాదనమాడంబరమాత్రమిత్యర్థః. ఏవమాక్షిప్య పరిహారమాహ—విధేయైరిత్యాది. ఖలు నిశ్చితం ప్రభో రీశ్వరస్య ధియో బుద్ధయః సంకల్పవిశేషాః పరతంత్రాః పరాధీనా న భవంతి, అపి తు స్వతంత్రా ఏవ. తాః కీదృశ్యః? విధేయైః స్వాధీనైః పదార్థైః క్రీడంత్యః ఖేలంత్యః. నహి క్రీడాయాం ప్రయోజనాద్యపేక్షాస్తి. తస్మాద్విచిత్రాణి వస్తూని స్వాధీనతయా క్రీడాసాధనీకృత్య క్రీడత స్తవ సర్వాణి కార్యాణి స్వేచ్ఛామాత్రేణ కర్తుం క్షమస్య లౌకికవైదికనియమానధీనబుద్ధేర్న కించిదప్యనుచితమిత్యర్థః.

తా. ఓపరమేశ్వరా! నీవు ఇచ్ఛామాత్రముచేతనే(సంకల్పమాత్రముచేతనే) మూఁడులోకములను దహించెడి శక్తిగలవాఁడవు. అట్టి నీకు ఈత్రిపురాసురుఁడను గడ్డిపోఁచను దహించుట కింత ప్రయత్నము ఆడంబరము ఎందుకు? ఆయాడంబరమెట్టిదనిన:—గొప్ప యుద్ధసామగ్రి. భూమియే రథముగను, బ్రహ్మ సారథిగను, మేరుపర్వతము ధనస్సుగను, సూర్యచంద్రులిద్దఱును రథచక్రములుగను, విష్ణుమూర్తి బాణముగను, నీవు రథికుఁడవునై యొప్పుట. ఇట్టు లీ చిన్నపని కింత గొప్పప్రయత్నమెందులకు? గోళ్లచేత తెగఁదగిన పనికి గొడ్డలిని ధరించిన ట్లున్నదనిన అట్లు కాదు. నీకు ఈత్రిపురదహనము చిన్నగడ్డిపోఁచను దహించునట్టిదే యైనను ఈపని నీకు క్రీడగా నున్నది. ప్రభువులసంకల్పములకు ఇతర సహాయమక్కఱలేదు. స్వతంత్రమైనవే. అయినను వీరందఱును నీకు స్వాధీనులు భృత్యులుగా నున్నందున వీరితోఁ గూడ క్రీడగా ఈపనిచేయఁ దలఁచినాఁడవు. అని పరమేశ్వరుని స్తుతిచేసిరి.

అవ. పరమేశ్వరునియందు విష్ణుమూర్తికిఁ గల భక్తిని, విష్ణుమూర్తియందు ఈశ్వరానుగ్రహప్రాప్తిని వర్ణించుచు స్తుతి చేయుచున్నారు:—

మూ. హరిస్తే సాహస్రం కమలబలిమాధాయ పదయో
ర్యదేకోనే తస్మిన్నిజముదహరన్నేత్రకమలం,
గతో భక్త్యుద్రేకః పరిణతిమసౌ చక్రవపుషా
త్రయాణాం రక్షాయై త్రిపురహర జాగర్తి జగతామ్.

వ్యా. అథ పరమేశ్వరవిషయే హరేర్భక్తిం చ తదనుగ్రహం చ ప్రదర్శ్య స్తౌతి:—హరిరితి. హే త్రిపురహర, హరిర్విష్ణుః తవ పదయోః సాహస్రం సహస్రసంఖ్యాపరిమాణాం కమలానాం పద్మానాం బలిముపహారం, సహస్రకమలాత్మకం బలిమిత్యర్థః. ఆధాయ సమర్ప్య తస్మిన్కమలసహస్రబలావేకోనే సతి ఏకేన కమలేన భక్తిపరీక్షార్థం త్వయా గోపితేన హీనే సతి నియమభంగో మాభూదితి తత్పూరణార్థం తదా కమలాన్తరమలభమానో నిజమాత్మీయం నేత్రకమలమేవోదాహరదుత్పాటితవాన్. యద్దైవం స్వనేత్రోత్పాటనరూపం భజనం, అసౌ భక్త్యుద్రేకః భక్తేస్సేవాయా అత్యంతప్రకర్షః చక్రవపుషా సుదర్శనరూపేణ పరిణతిం గతః త్రయాణాం జగతాం రక్షాయై జాగర్తి. పరిపాలనార్థం సావధాన ఏవ వర్తతే ఇత్యర్థః. ఏవమాఖ్యాయికాచ పురాణప్రసిద్ధా. తథా చైవంవిధాచింత్యమాహాత్మ్యస్త్వమసీతి భావః

తా. ఓశంకరా! విష్ణుమూర్తి ఒకసమయమందు నీభక్తుఁడై నందున నీపాదపద్మములందు సహస్రకమలములతోఁ బూజ

చేయఁ దలఁచి పరికరము కూర్చుకొని పూజ కారంభించి కమలములు నీపాదములయందుఁ బూజించుచుండఁగా అతనిభక్తిపరీక్షార్థమై నీవు ఒకకమలమును గుప్తముచేసినాఁడవు. అందువలన కమలసహస్రములో నొకటి తక్కువయినది. విష్ణుం డది చూచి సహస్రమునకు నియమభంగము కాఁగూడదని తననేత్రమునే కమలముగా సమర్పింపఁ దలఁచి తనచేతితో నేత్రమును దీసి నీపాదములపై నుంచగా, నీవు ప్రత్యక్షమై అతనిభక్తికి మెచ్చి సంతోషించి విష్ణునకు నేత్రము నెప్పటివలె నిచ్చి అతనికి మూఁడు లోకములకు పరిపాలనాధికారమును, జగద్రక్షణసాధనముగా సుదర్శనమనెడి చక్రమును నిచ్చితివి. ఇది నీకు విష్ణునియందలి యనుగ్రహమేగాక మూఁడులోకములయం దనుగ్రహమునకు సదా నీవు జాగరూకతగానే యున్నాఁడవని తెలుపుచున్నదని ఈశ్వరుని స్తుతించిరి.

అవ. వెనుకటిశ్లోకములయందు పరమేశ్వరారాధనవలననే సకలపురుషార్థములు సిద్ధించునని అన్వయవ్యతిరేకముగా నిరూపించి, ఇచట కొంతమంది మీమాంసకులు పరమేశ్వరాపేక్షలేకయే కర్మ పుట్టకమునుపే శుభాశుభఫలము నిర్ణయమైయున్నదని చెప్పుచున్నారు గాన, వారిని నిరాకరించుచు శంకరుని స్తుతించుచున్నారు:—

**మూ.** **క్రతౌ సుప్తే జాగ్రత్త్వమసి ఫలయోగే క్రతుమతాం**
**క్వ కర్మ ప్రధ్వస్తం ఫలతి పురుషారాధనమృతే,**
**అతస్త్వాం సంప్రేక్ష్య క్రతుషు ఫలదానప్రతిభువం**
**శ్రుతౌ శ్రద్ధాం బధ్వా కృతపరికరః కర్మసు జనః. ౨౦.**

వ్యా. ఏవం పూర్వశ్లోకేషు పరమేశ్వరారాధనాదేవ సర్వ పురుషార్థసిద్ధిరిత్యన్వయవ్యతిరేకాభ్యాముక్త్వా తత్ర కేచిన్మీమాంసకంమన్యాః పరమేశ్వరనిరపేక్షాత్కర్మజనితాత్పూర్వాదేవ శుభాశుభప్రాప్తిరిత్యాహుస్తాన్నిరాకుర్వన్ పరమేశ్వరం స్తౌతి:— క్రతావితి. హే త్రిపురహరేతి సంబోధనం పూర్వశ్లోకాదనుషజ్యతే. క్రతౌ యాగాదికర్మణి ఆశుతరవినాశి స్వభావత్వాత్సుప్తే లీనే స్వకారణే సూక్ష్మరూపతాం ప్రాప్తే ధ్వస్తే సతి, క్రతుమతాం యాగాదికర్మకారిణాం కాలాంతరదేశాంతరభావి తత్తత్ఫలసంబంధే తన్నిమిత్తం త్వం జాగ్రదసి ప్రబుద్ధ ఏవ వర్తసే. వర్తమానే విహితేన క్రతౌ జాగరణస్య సర్వదాస్తిత్వముచ్యతే తేన సర్వదైవావహితోఽసీత్యర్థః. నను లిఙాదిపదవాచ్యక్రియాయాః స్వర్గాదిసాధనత్వాన్యథానుపపత్త్యా కల్ప్యమపూర్వమేవ ఫలయోగాయ జాగర్తి కిమీశ్వరేణేత్యత ఆహ. క్వేత్యాది. ప్రధ్వస్తం వినష్టం కర్మ పురుషస్య చేతనస్య ఫలదాతురారాధనం వినా క్వ ఫలతి? న క్వాపీత్యర్థః. నహి లోకే కుత్రాపి వినష్టస్య కర్మణోఽపూర్వద్వారా ఫలజనకత్వం దృష్టం. లోకానుసారిణీ చ వేదేఽపి కల్పనా లోకవేదాధికరణన్యాయాత్. చేతనస్య తు రాజాదేరారాధితస్య వినైవాపూర్వం సేవాదేః ఫలజనకత్వం దృశ్యతే. తత్ర లోకదృష్టప్రకారేణైవ వైదికకర్మణామపి ఫలజనకత్వసంభవేన లోకవిరుద్ధాఽపూర్వఫలదాతృత్వకల్పనావకాశః. అపూర్వం హి లోకసిద్ధకారణాంతరనిరపేక్షం వా స్వర్గాదిఫలం జనయేత్తత్సాపేక్షం వా. ఆద్యే తత్ఫలోపభోగయోగ్యదేహేంద్రియాదికమపి నాపేక్షేత. న చైతదిష్టం,సర్వస్యాపి సుఖదుఃఖాదేః శరీరసంయుక్తాత్మమనోయోగాదిదృష్టకారణజన్యత్వా

భ్యుపగమాత్. ద్వితీయే తు లోకసిద్ధదేహేంద్రియాద్యపేక్షేవ దీశ్వరాపేక్షాపి నియతా, లోకే తథాదర్శనాత్. తస్మాచ్ఛ్రుతి న్యాయసిద్ధేశ్వరపదార్థధర్మి బాధకల్పనాద్వరమ పూర్వపదార్థస్యై నైరపేక్ష్య ధర్మమాత్ర బాధకల్పనం. "ఫలమత ఉపపత్తేః" ఇతి న్యాయాత్. ఇదం చాపూర్వమభ్యుపేత్య తత్సాపేక్షత్వమీశ్వ రస్యోక్తం. వస్తుతస్తు నాపూర్వే కించిత్ప్రమాణమస్తి. లిఙా దీనామిష్టాభ్యుపాయతావాచకత్వాత్. తదన్యథానుపపత్తేశ్చ శ్రుతిన్యాయసహస్రసిద్ధపరమేశ్వరేణైవోపక్షయాత్ నాపూర్వ సిద్ధిః. అపూర్వం చ తత్ఫలదాతృత్వం చ ద్వయం భవద్భిః కల్ప్యం. అస్మాభిస్తు కేవలమీశ్వరః కల్ప్యః. తస్య ఫలదాతృత్వాదికం తు చేతనత్వాద్రాజాదివల్లోకసిద్ధమేవ. సర్వజ్ఞత్వేన చ తత్తత్కర్మాను రూపఫలదాతృత్వాన్న వైషమ్యనైర్ఘృణ్యాదిదోషప్రసంగః. యత ఏవం త్వమేవ సర్వకర్మఫలదాతాఽతస్త్వం క్రతుషు శ్రౌతస్మార్తకర్మసు కాలాంతరఫలసాధనేషు ఫలదానప్రతిభువం ఫలదానాయ లగ్నకమివ సంప్రేక్ష్య సమ్యక్ శ్రుతిస్మృతి న్యాయైః ప్రకర్షేణ నిశ్చిత్య కర్మఫలదాతుస్తవ సద్భావప్రతిపాది కాయాం హి శ్రుతౌ "ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి ద్యావాపృథివ్యౌ విధృతే తిష్ఠతః, ఏతస్య వా అక్షరస్య ప్రశా సనే గార్గి దదతో మనుష్యాః ప్రశంసంతి యజమానం దేవా దర్వీం పితరోఽన్వాయత్తాః" "కర్మాధ్యక్షస్సర్వభూతాధివాసః" "ఏష ఉ హ్యేవ సాధు కర్మ కారయతి తం యమున్నినీషతే ఏష ఉ హ్యేవ వాఽసాధుః" ఇత్యాదికాయాం శ్రుతౌ శ్రద్ధాం బధ్వా అర్థవాదత్వప్రయుక్తస్వార్థాప్రామాణ్యాశంకా నిరాసేన లోకసిద్ధదృఢతరన్యాయానుగృహీతతయా దేవతాధి

కరణన్యాయేన స్వార్థే ప్రామాణ్యం నిశ్చిత్య జనశ్శ్రుతిస్మృతి విహితకర్మాధికారీ కర్మసు శ్రౌతస్మార్తేషు కృతపరికరః కృతః పరికర ఉద్యమో యేన స తథా కృతారంభో భవతీత్యర్థః. ప్రతి భూసాదృశ్యం చ ఏతావన్మాత్రేణైవ వివక్షితం. యథా కశ్చి దుత్తమర్ణః ప్రమాణనిశ్చితం దీర్ఘకాలావస్థానం స్వధనార్పణ సమర్థం కంచిత్ప్రతిభువం నిరూప్య అధమర్ణే పలాయితే మృతే వా ఏతస్మాదేవ కుశలినః ప్రతిభువస్సకాశాత్స్వధనం ప్రాప్స్యా మీత్యభిప్రాయేణ యస్మైకస్మైచిదధమర్ణాయర్ణం ప్రయచ్ఛతి తద్వదధమర్ణస్థానీయే కర్మణి ప్రలీనేఽపి పరమేశ్వరాదేవ ప్రతి భూస్థానీయాత్తత్ఫలం ప్రాప్స్యామీత్యభిప్రాయేణోత్తమర్ణ స్థానీయో యజమానో నిఃశంకమేవ కర్మానుతిష్ఠతీతి భావః.

తా. క్రతువు లీనమై యుండఁగా (నాశమును పొందఁగా) క్రతువును జేసినవారికి ఫలము నిచ్చెడి విషయమై నీవు మేలుకొని యే యున్నాఁడవు.(క్రతువులందు)ఫలదాతయైన ఈశ్వరారాధన లేనిది మధ్యను చెడిపోయినకర్మ ఎట్లు ఫలమిచ్చును? అందువలన యజ్ఞాదులందు కర్మఫలదానమున కధికారివైయైనందున నిన్ను ఆరా ధించియే శ్రుతి—వేదమందు ప్రమాణబుద్ధికలవారై యోగ్య మైన విద్వాంసులు యాగాదులందు దృఢమైన సామగ్రి కలవా రగుచున్నారు. ఓశంకరా! లోకమందు కొంతమంది శ్రౌతస్మార్తాది కర్మలయందు మాత్ర మాసక్తి కలిగి సకలకర్మలకు ఫలదాతవు నీవే యని యెఱుఁగనివారై నిన్నారాధించక కేవలకర్మలే తమకు ఫలము నిచ్చునని నమ్మి చెడుచున్నారు. విఘ్నమైన క్రతువులు గాని, నిన్నారాధించని కర్మలు గాని అట్టికర్తలకు ఫలమునిచ్చెడి విషయమందు నీవు జాగరూకతగానున్నావు. ఫలమును బొందఁ

